# వైదికాచారములు — వివాహ వ్యవస్థ



ర చ న :

వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి

ప్ర చు ర ణ :

శ్రీమదార్షవాణీ ప్రచురణాలయము

కేదారేశ్వరపేట : విజయవాడ-3.

[ కాపీరైటు రిజర్వుడు ]

# మా మా ట

త్రికాలజ్ఞులయిన మహర్షులు భారత దేశమున జన్మించి భారత జాతికి సమగ్రమైన సుఖభోగములు కలుగునట్లుగా తీర్చిదిద్దినారు. వారి వాక్యములలో, వారికి సమాజమునందు గల ప్రేమ గౌరవము భక్తి శ్రద్ధ మొదలగునవి ఎన్నియో అంశములు స్పష్టమగును. వారి వాక్యములు మానవజాతి సమున్నతి ద్వారా ఆధ్యాత్మిక జ్ఞానమునకు పరమశాంతికి తోడ్పడును.

భౌతిక విజ్ఞానము పెచ్చు పెరిగిన ఈ రోజులలో వారి వాక్యములు మరుగున పడిపోయినవి, అందుచేతనే ఎన్నో రకములయిన భోగసాధనములు లభించినను సమాజము అశాంతితో కుమిలిపోవుచున్నది. అట్టి సమాజమునకు మహర్షుల వాక్యములు అమృత ప్రాయములు.

సమాజము సుఖశాంతులతో వర్ధిల్లుటకు సరియైన వివాహవ్యవస్థ అత్యంతము ముఖ్యము. ఈనాడు శాస్త్రము ననుసరించి సరియైన వివాహ సంస్కారము జరుగక పోవుటచేతనే వివాహ విచ్ఛేదములు జరుగుచున్నవి. అట్టి సంస్కార విహీనతను దూరముచేసి సరియైన వివాహ సంస్కారము ద్వారా సమాజమును సుఖవంతము చేయుటకే నా యీ ప్రయత్నము. దీనిని చదివిన భారతీయులందరు శాస్త్రసమ్మతమైన వివాహ సంస్కారము పొంది తమ జీవితమును సుఖవంతము చేసుకొనగలరని ఆశించుచున్నాము. ఇందలి విషయములన్నియు నిర్ణయసింధువు నాధారముగ వివరించబడినవి.

— వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి

లోక హితైషుల యభిప్రాయము

## మనువు - మానవ ధర్మములు

మనుష్యుడు బ్రాహ్మ ముహూర్తమున లేచినప్పటినుండి ఎలా చరించాలి? ఎలా వ్యవహరించాలి? అను విషయము మొదలుకొని ఒక

బండి ప్రమాదములో ఎవరైనా మరణిస్తే ఆ బండియజమానికి లేదా ఆ బండి తోలువానికి ఏలాంటి శిక్ష వేయతగుననే మారుమూల విషయం వరకు ఇందు ప్రస్తావింపబడింది. వ్యక్తి నియమములు, సమిష్టి నియమములు సంప్రదాయములు, పాలితుల నియమములు, పాలకుల ధర్మములు ఇంకా ఎన్నెన్నో చెప్పబడ్డాయి. నేటి సమాజమును నులిమివేస్తున్న అవినీతి, ధర్మరాహిత్యంవంటి వానినుండి నిష్కృతి యేమిటి అనే విషయంలో ఇందు మార్గదర్శనం కనిపిస్తుంది. ఇలా ఎన్నని చెప్పాలి. మానవ జీవితంలోని అన్ని అంశములు ఇందు ప్రస్తావింపబడ్డాయి. అంటే అతిశయోక్తికాదు. మనకున్న సంస్కారమంతటికి మూలమిది.

శాస్త్రిగారి శైలి మృదుమధురము. ద్రాక్షారసము త్రాగుతున్నట్లు నడుస్తుంది.

తూములూరి లక్ష్మీనారాయణ

నిత్య జీవితమునకు పరమావశ్యకములయిన మనుస్మృతిలోని ప్రధాన విషయములను వివరణపూర్వకముగ లోకమున కందించిన మీకు హార్దిక కృతజ్ఞతాభివందనములు, లోకము మీ ఋణము తీర్చుకొనజాలదు. సర్వమానవ జీవిత సముద్ధరణకు ఈ గ్రంథము పరమోపకారము. భిన్నభిన్న విషయములను గైకొని సులభసుందరముగ వేదాంత వ్యాస రత్నావళిని మీరు రచించుట అత్యంత ప్రశంసార్హము. సుఖము శారీరకమా, మానసికమా? అద్వైతము అంతుపట్టని విషయమా, మోక్షం అంటే ఏమిటి, నిత్యానందము అను వ్యాసములు ఆణిముత్యములు. మీవంటి పండితులు లోకమునకు తప్పక అందించవలసిన విషయములు అవి

హృదయపూర్వక కృతజ్ఞతలు.

విశాఖపట్టణం
10-10-93

వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి
ఆంధ్రా యూనివర్సిటీ



# వైదికాచారములు — వివాహ వ్యవస్థ

వేద ధర్మమును అనుసరించిన బ్రాహ్మణుల వివాహ విషయములను గురించి మహర్షు లెందరో ఉన్నత విషయములను చెప్పిరి. వారు చెప్పినవిషయములు బహుముఖములుగా నుండి పరస్పర భేదాభిప్రాయ మున్నట్లు గన్పించినను వారందరి పరమలక్ష్యము వివాహశుద్ధియే. వరునకు వధువునకు ఉండవలసిన లక్షణములు, వయస్సులు, గోత్రములు, కాలము, ముహూర్తము, వివాహములయందలి రకములు, వివాహములు, చేయవలసిన విధానములు, ప్రాయశ్చిత్తములు మున్నగు విషయములనుగురించి మహర్షులు ఎన్నియో ప్రశస్తవాక్యములు చెప్పిరి. దానివలన సమాజమునందు వివాహము ఎంత ఉన్నతమైనదో వ్యక్తిజీవితమున ఎంత ప్రముఖమైనదో తెలియుచున్నది. వైదిక, బ్రాహ్మణాచార వ్యవస్థకు వారి వాక్యములే ప్రమాణములు.

## -: గోత్ర నిర్ణయము :-

వైదిక బ్రాహ్మణులకు వివాహవిషయమున గోత్ర విచారము అతిముఖ్యమైన అంశము. భవిష్యత్కాలము తెలిసిన

మహర్షులు ఎవరికైన స్వగోత్రము తెలియనిచో ఏమి చేయ వలయుననను విషయమును విచారించి నిశ్చయించిరి. స్వగోత్రము తెలియని సమయమున తమ ఆచార్యుల గోత్రమును గాని పురోహితుని గోత్రమునుగాని ఆశ్రయించవలయును. అటుల కుదరని యెడల తనకుతాను ఎవరికైన స్వయముగ దత్తతపోయి వారిగోత్రము నాశ్రయించి అన్యగోత్రమున పుట్టినకన్యను వివాహము చేసుకొనవలయును. అటుల కుదర నిచో జమదగ్ని గోత్రమును ఆశ్రయించవలయునని "దివోదాసీయ" మను ధర్మశాస్త్ర గ్రంథమున గలదు.

తల్లిగోత్రమునకు చెందిన కన్యను వివాహమాడరాదు. అటుల పొరపాటున వివాహమాడిన చాంద్రాయణ వ్రతము చేయవలయును, అటులనే ఋషులు కలసిన కన్యను గూడ వివాహమాడరాదు. వారు చెల్లెలువంటివారే యగుదురు.

ఒకవేళ తెలియక వివాహమాడినచో సగోత్రమని తెలిసిన పిమ్మట ఆమెను భోగమునుండి దూరముగ ంచి తల్లివలె పోషించ వలయునని బోధాయన మహర్షి చెప్పెను.

## -: వివాహకాలము :-

కన్యను ఆరు సంవత్సరముల వయస్సు వచ్చువరకు చంద్రుడు, గంధర్వుడు, వాయువు ఆశ్రయించి యుందురు గాన ఆరు సంవత్సరముల లోపల వివాహము చేయరాదు అటుపిమ్మట బేసి సంవత్సరములయందు చేసిన కష్టజీవియు

సమ సంవత్సరములయందు చేసిన విధవ యగును. కాన గర్భస్థకాలమును కలుపుకొని సమసంవత్సరముల యందు వివాహము చేసిన పతివ్రతయగునుఅని జ్యోతిర్నిబంధగ్రంథ మునగలదు. పరాశర మాధవీయమునందు జన్మదినమునుండి గాని తల్లి గర్భమున నున్న కాలమునుండిగాని అయిదు సంవత్సరములు దాటిన తరువాత వివాహము చేయవలయు నని కలదు.

ముప్పది సంవత్సరముల వయస్సుగల వరుడు పది యారు సంవత్సరముల వయస్సు కలిగి రజస్వల కాని కన్యను వివాహ మాడవలయును. అటులకాక ఇరువది సంవత్సరముల వయసుగల వరుడు ఎనిమిది సంవత్సరముల వయసు గల కన్యను వివాహ మాడవలయును. రజస్వల కాకమునుపే తండ్రి కుమార్తెకు వివాహము చేయ వల యును. అన్ని వర్ణముల వారికిని ఏడు సంవత్సరములు దాటిన పిమ్మట వివాహము చేయవలయును. అటుల చేయని వాడు ధర్మగర్హితుడగునని మహాభారతమునగలదు. ముప్పది సంవత్సరముల వయసుగల వరుడు పండ్రెండు సంవత్సర ముల వయసుగల కన్యను వివాహమాడవలయునని మనువు చెప్పెను. కన్యకు ఎనిమిదిసంవత్సరముల వయస్సే యోగ్య కాలముగ చెప్పబడినది. అటుపిమ్మట రజస్వలయే అను నిశ్చయము గలదు. వివాహము చేయతగిన తల్లిదండ్రులు

లేని సమయమున పండ్రెండు సంవత్సరములుగాని పది యారు సంవత్సరములుగాని వివాహవయస్సుగ ఆపత్కాలమున చెప్పబడినది. రజస్వలయైన కన్య మూడుసంవత్సరముల కాలము తండ్రిశాసనమునననుసరించి గృహమున నుండవలయుననియు తండ్రి అప్పటికిని వివాహము చేయజాలనిచో స్వయముగ చేసుకొనవచ్చు ననియు మనువు చెప్పెను.

## -: గ్ర హ బ ల ము :-

స్త్రీలకు గురుబలము శ్రేష్ఠమైనది. పురుషులకు రవి బలము శ్రేష్ఠమైనది. చంద్రబలము ఇద్దరకు శ్రేష్ఠమైనది ఎనిమిది సంవత్సరముల బాలిక గౌరి యనియు, తొమ్మిది సంవత్సరములు గలది రోహిణి యనియు,పది సంవత్సరముల వయస్సు బాలిక కన్య యనియు, అటుపిమ్మట రజస్వల యనియు చెప్పబడును, గౌరియైన కన్యకు రవిగురు బలము. రోహిణికి రవిబలము, కన్యకు చంద్రబలము, రజస్వలకు లగ్నబలము చూడవలయును. వివాహ సమయమున కన్యకు గ్రహానుకూల్యములేనిచో బృహస్పతిపూజ చేయవలయును. బంగారముతో చేసిన బృహస్పతి విగ్రహమునకు పచ్చవస్త్రము కప్పవలయును. ఈశాన్యదిక్కుయందు తెల్లని వస్త్రమును కప్పిన కుంభమును ధాన్యముపై నుంచి వివిధములయిన ఓషధులను కుండముననుంచి పూజించవలయును. పూజానంతరము రావి సమిధలు నెయ్యి పరమాన్నము తిలలు మొదలగు

వానితో బృహస్పతి మంత్రము చెప్పి నూట యెనిమిది సారులు హోమము చేయవలయును. బృహస్పతి విగ్రహ మును నూతనవస్త్రముతో కూడిన కుంభమును బ్రాహ్మణున కీయవలయును. పిమ్మట బ్రాహ్మణులకు భోజనము పెట్ట వలయును. ఈ విషయమును శౌనక మహర్షి చెప్పెను.

## -: కన్యాదానము చేయ తగినవారు :-

తండ్రి, తండ్రి లేనిచో తండ్రి తండ్రి, ఆయన లేనిచో సోదరుడు, అతడు లేనిచో ఆ వంశపు దాయాదులు. వారును లేనిచో తల్లి, పైన చెప్పినవారు కన్యాదానము చేయనిచో భ్రూణహత్యా దోషమును పొందుదురు. ఎవరును లేనిచో కన్యయే స్వయముగ స్వయంవరము చేసుకొనవలయును. సంస్కారమును పొందిన సోదరులు మాత్రమే కన్యాదానము చేయుటకు అర్హులు. సంస్కారమును పొందనివారు సంస్కా రమును పొందిన సోదరులచే సంస్కరింపతగినవారని యాజ్ఞ వల్క్యుడు చెప్పెను. కన్య తాను స్వయంవరము చేసికొని నను లేక తల్లి కన్యాదానము చేసినను వారే నాందీశ్రాద్ధము చేయతగినవారు. వారు ప్రధాన సంకల్పముచేసి మరియొక బ్రాహ్మణునిచేత మిగిలిన దంతయు చేయించవలయునని ప్రయోగ పారిజాతమునగలదు, వరుడు మాత్రము సంస్కా రము పొందిన సోదరులులేనిచో స్వయముగ నాందీశ్రాద్ధము చేయవలయును కాని తల్లి చేయరాదు, పుత్రులుండగ తల్లి

హోమము చేయరాదని నిషేధము గలదు. తండ్రి, తండ్రీ యనుమతితో సోదరుడు, మాతామహుడు, మేనమామ తన కుటుంబము వారుకానీ, కన్యాదానము చేయతగినవారని నారద వచనము గలదు. ఈ విధముగనే కాత్యాయన మహర్షి కూడ చెప్పెను! ఎవరును లేని సమయమున తల్లియైనను కన్యాదానము చేయవచ్చును. ఎవరును దానము చేయువారు లేని సమయమున రాజును ఆశ్రయించవలయునని మనువు చెప్పెను. ఇతరుల కన్యను దానము చేయవలసిన సమయమున ఆ కన్య తల్లి దండ్రులకు బంగారమిచ్చి ఆ కన్యను తనదిగచేసుకొని తన గోత్రము కానివారికి కన్యాదానము చేయవలయును, గౌరిని దానముచేసినవాడు స్వర్గలోకమును రోహిణిని దానము చేసినవాడు వైకుంఠమును కన్యను దానము చేసినవాడు బ్రహ్మలోకమును రజస్వలను దానము చేసిన వాడు రౌరవ నరకమును పొందుదురు.

## -: కన్యాదాన కాలము :-

మాఘ ఫాల్గుణ వైశాఖ మార్గశీర్ష జ్యేష్ఠ ఆషాఢ మాసములయందు వివాహము చేసికొనిన కన్య ఐశ్వర్య వంతురాలు అదృష్టవంతురాలు అగునని యు శ్రావణ పుష్య భాద్రపద చైత్ర అశ్వయుజ కార్తికములందు వివాహము చేసుకొనిన కన్య విధవరాలు అగునని జ్యోతిః ప్రకాశ గ్రంథమున గలదు. మాఘ ఫాల్గుణ వైశాఖ జ్యేష్ఠ మాసములు శుభ

ప్రదములనియు కార్తిక మార్గశిరములు మధ్యమము లనియు ఇతర మాసములు నింద్యములనియు నారద వాక్యముగలదు. సూర్యుడు మకరరాశియందు ప్రవేశించిన చైత్రమును, సూర్యుడు మిథునరాశియందు ప్రవేశించిన అషాఢమును ప్రశస్తములని వసిష్ఠుడు చెప్పెను. వరుడు జ్యేష్ఠుడు, కన్యా జ్యేష్ఠురాలు, జ్యేష్ఠమాసము. ఈ మూడును పనికిరావని మిహిరుడు చెప్పెను. దీననే త్రిజ్యేష్ఠ పనికిరాదని పెద్దలు చెప్పుదురు.

## -: కుంభ వివాహము :-

కన్యకు జాతకము ననుసరించి వైధవ్య యోగ మున్నచో ముందుగా కుంభముతోగాని వృక్షప్రతిమతోగాని వివాహము చేయవలయును. బంగారపునీరు పిప్పిలి వృక్షము విష్ణుస్వరూపములు. వానితో వివాహము చేసిన పునర్వివాహ దోషముండదని విధావఖండమున గలదు. వివాహమునకు పూర్వము చంద్రతారాబలములు చూచి కన్యకు వివాహ విధి ననుసరించి కుంభముతో వివాహము చేయవలయును. కుంభమును కుంకుమతో నలంకరించ వలయును. వారిద్దరిని ఏకాంత మందిరమున ఉంచవలయును. తరువాత కుంభమును బ్రద్దలు చేసి నీటిలో కలుపవలయును. కుంభము నిట్లు ప్రార్థించవలయును- ఓ కుంభమా! నీవు కరుణా స్వరూపురాలవు. జీవనమునకు ఆశ్రయమైనదానవు. ఈ కన్యయొక్క

పతిని జీవింపచేసి కన్యకు పుత్ర సుఖమును కలిగించుము. ఓ విష్ణువా! కన్యను వైధవ్య దుఃఖమునుండి రక్షించుము. పిమ్మట ఒక మంచి బ్రాహ్మణుని పూజించి అతనికి నాలుగు భుజములు గల బంగారు ప్రతిమను యథాశక్తి దక్షిణతోగూడ దానము చేయవలయును. ఆ సమయమున ఆ బ్రాహ్మణుని యిటుల ప్రార్థించవలయును- "నేను పూర్వ జన్మమున పతి సమాగమమును నిరాకరించి యుండవచ్చును. అటులగాక పతియందు విరక్తిగలదాననై పతిప్రాణములకు హాని కలిగించి యుండవచ్చును. దానివలన నాకు కీర్తి సౌఖ్యధనముల హాని కలుగ నున్నది. ఆ హాని నివారణ నిమిత్తము సౌభాగ్య నిమిత్తము ఓ బ్రాహ్మణోత్తమా నీకు బంగారముతో నిర్మించిన విష్ణు విగ్రహమును దానము చేయుచున్నాను. దీనివలన నేను పాప విముక్తురాలనయితిని. "అనఘాద్యాహమస్మి" అని మూడు పర్యాయములు చెప్పవలయును. ఆ బ్రాహ్మణుడు అటులనే అగుగాక యని యాశీర్వదించవలయును. తరువాత నిశ్చయించుకొనిన వరునితో వివాహము శాస్త్ర ప్రకారము చేయవలయును.

## -: ప్రతికూల సమయము :-

వివాహ నిశ్చయమైన తరువాత కన్యాపక్షమునందు గాని, వరుని పక్షమునందుగాని, తండ్రి, తల్లి, పినతండ్రి, సోదరుడు, నాయనమ్మ మొదలగు దగ్గరి బంధువులకు మర

ణము సంభవించినచో ఆ వధూవరులకు వివాహము చేయ రాదు. అటులచేసిన కన్యకు వైధవ్యము కలుగునని జ్యోతి ర్నిబంధ గ్రంథమునందు గర్గవాక్యముగలదు. ఈ విషయ మునే జ్యోతిర్మేధాతిథిచంద్రికయందును చెప్పెను. అటులనే భృగు మహర్షియు శౌనకుడును మాండవ్య మహర్షియును చెప్పిరి.

## ప్రతికూలములకు నివారణోపాయములు

వివాహనిశ్చయానంతరము రెండు వంశములవారి యందు ఎవరికైన మరణము సంభవించిన ఒక సంవత్సరా నంతరము వివాహము చేసిన శుభము కలుగునని మేధాతిథి చెప్పెను. తండ్రిమృతివలన ఒక సంవత్సరము ఆశౌచ ముండును. తల్లి మృతివలన ఆరునెలలు, భార్యమృతి వలన మూడు నెలలు, సోదరుని మృతివలన, కుమారుని మృతివలన నలుబదియైదు రోజులు, దాయదుల మృతివలన నెలరోజులు ఆశౌచముండును. ఆశౌచానంతరము శాంతికర్మలు చేసి వివా హము చేయవలయునని స్మృతి రత్నావళియందు గలదు. ప్రాతికూల్యము కలిగినచో ఒక మాసానంతరము శాంతినిచేసి గోదానముచేసి మరలనిశ్చయ తాంబూలము పుచ్చుకొన వల యును. శాంతి యనగ వినాయక శాంతియని జ్యోతిః ప్రకాశ గ్రంథమున గలదు, ఆశౌచము కలిగినచో ఆశౌచానంతరము

వినాయకపూజచేసి శుభకర్మ చేయవలయునని యాజ్ఞ వల్క్యుడు చెప్పినటుల మేధాతిథి గ్రంథమున గలదు.

## రజోదోషమునందు నిర్ణయము

వివాహ ప్రారంభమునకు ముందు కన్యతల్లి రజస్వల అయినచో వివాహము చేయరాదు, వివాహమున నాందీ శ్రాద్ధమే ప్రారంభమని శాస్త్రనిర్ణయము మేధాతిథి గూడ చౌలము, వ్రతము, వివాహము, యజ్ఞము మొదలగు వాని యందు భార్య రజస్వల అయినచో చేయరాదని చెప్పెను. ఈ విధముగనే మనువు - వృద్ధ మనువు గర్గుడు చెప్పిన వాక్యములు గలవు, నాందీశ్రాద్ధానంతరము రజస్వల అయినచో హోమపూర్వకముగ గోవును, దానముచేసి వివాహము చేయవలయును. అటులచేసినను వివాహసంస్కారము జరుగు సమయముననే శుచియనియు మిగిలిన సమయములందు అశుచి యనియు చెప్పబడెను. రజస్వలానంతరము శుచి యైన పిమ్మట మంచి ముహూర్తము లేనిచో మాషపరిమిత మైన బంగారముత లక్ష్మీవిగ్రహమును చేసి ఆమెను శ్రీసూక్త ముతో పూజించి ప్రతి ఋక్కుకు పాయసముతో హోమము చేసి శుభముహూర్తము జరిపించవలయునని కపర్దికారికల యందు గలదు, సూతకాదులు వచ్చినపుడు కూశ్మాండ హోమము చేసి పాలు ఇచ్చునట్టి గోవును దానముచేసి వివాహము చేయవలయు ననియు గలదు.

## ఏక క్రియా నిర్ణయము

ఒకే గర్భమున జన్మించిన బాలబాలికలకు ఒకే సమయమున వివాహము చేయరాదు. తల్లులు వేరైనచో చేయవచ్చునని జ్యోతిర్నిబంధమున వృద్ధ మనువు వాక్యము గలదు. ఒకే గర్భమున పుట్టినవారిద్దరికి ఆరుమాసముల లోపల వివాహము చేసినచో వారిలో ఒకరికి మూడు సంవత్సరముల లోపల వైధవ్యము తప్పక కలుగునని వరాహుడు చెప్పెను. ఈ విధముగనే వసిష్ఠుడుగూడ చెప్పెను. ఆరు మాసములలోపల సంవత్సరభేదము కలిగినను చేయవచ్చునని అచ్చటనే గలదు. కుమారుని వివాహము తరువాత కుమార్తె వివాహము చేయరాదు. కన్యను అత్తవారింటికి పంపకుండ కోడలిని తెచ్చుకొనరాదని సంహితా ప్రదీపమున గలదు. రెండు శుభకార్యములు ఒకే గృహమున చేయరాదు. తప్పనిసరి యైనచో ద్వారభేదము, ఆచార్యభేదము ఉండవలయునని వసిష్ఠుని వాక్యము గలదు. సంకటు సమయము నందు మాత్రము పుత్రికకు వివాహముచేసి నాలుగు రోజులు పిమ్మట రెండవ కుమార్తెకు చేయవలయునని కపర్ధికారికల యందు కలదు. వివాహారంభమునుండి నాలుగు దినముల లోపల శ్రాద్ధముగాని, దర్శశ్రాద్ధముగాని వచ్చిన యెడల కన్య విధవరాలు అగును. లేనిచో సంతానము లేనిదియగును అని జ్యోతిర్నిబంధమున గలదు. వివాహ సమయమునకు

అడ్డుగా ప్రేతశ్రాద్ధములుగాని సపిండీకరణముగాని వచ్చిన యెడల వానిని అపకర్షచేసి ముందుగా చేయవలయును అని హేమాద్రియందు శాఠ్యాయని వాక్యము గలదు. ప్రేతకార్యములు పూర్తి చేయకుండగ శుభకార్యములు చేయరాదని మేధాతిథి చెప్పెను. కవలపిల్లలకు మాత్రము ఒకే సంవత్సరమున ఒకేరోజున ఒకే మండపమునందు వివాహము చేయవచ్చునని భట్టకారికయందు గలదు. ఒకే వరునికి ఏకగర్భజాతులయిన ఇద్దరు కన్యలను ఇవ్వరాదని జ్యోతిర్నిబంధమున గలదు.

## రజస్వలానంతర వివాహము చేసినందులకు ప్రాయశ్చిత్తము

రజస్వలయయిన కన్యక స్నానముచేసి శుచియైన పిమ్మట వరుడు వివాహమాడవలయును. కన్యతండ్రి ఆమెను చక్కగా కన్యాదాన పర్యంతము రక్షించి కన్యాదాన దినమునకు పూర్వము ఋతుసంఖ్యననుసరించి గోవులను దానము చేయవలయును. అటులచేయుటకు శక్తి లేనిచో ఒకగోవునైనను దానము చేయవలయును. దానికికూడ శక్తి లేనిచో బ్రాహ్మణులకు భోజనముపెట్టి ప్రాయశ్చిత్తము చేసుకొనవలయును. అటుపిమ్మట కన్యాదానము చేయవలయును. కన్య మూడురోజులు ఉపవాసము చేయుచు రాత్రి సమయ

మున అప్పుపాలు త్రాగవలయును. అట్టికన్యను వివాహ మాడ దలచిన వరుడుకూడ కూశ్మాండ హోమము చేయవలయునని అశ్వలాయన మహర్షి చెప్పెను.

వివాహము జరుగు సమయమున ఋతుమతి యయినచో ఆమెను స్నానము చేయించి అలంకరించి "యుంజానః" మంత్రములతో హోమముచేసి పిమ్మట వివాహము చేయవలయునని మదన పారిజాతమున యాజ్ఞవల్క్యని వాక్యము గలదు.

పుమాంసౌ మిత్రావరుణౌ పుమాంసా వశ్వినా వుభౌ
పుమా నింద్రశ్చ సూర్యశ్చ పుమాంసం చ దధాత్వియమ్

అను మంత్రములచే కన్యను శుద్ధిచేసి పండ్రెండు రోజులు పంచగవ్యములు తినిపించి పరిశుద్ధురాలను చేసి వివాహము చేయవలయునని బోధాయన సూత్రమున చెప్పబడెను.

## వివాహ భేదములు

బ్రాహ్మణునకు అర్షసమ్మతములయిన వివాహములు బ్రాహ్మము, దైవము, అర్షము, ప్రాజాపత్యము అని నాలుగు గలవు. విద్యాచారములుగల వరుని స్వయముగ పిలిచి వస్త్రాదులచే నలంకరించి కన్యనుగూడ నలంకరించి దానము

చేయుట బ్రాహ్మ వివాహము. ఆ వివాహమువలన కలిగిన పుత్రుడు తనకు పదితరముల పూర్వులను తన నుంచి రాబోవు పదితరములవారిని తనను పాపము నుండి విముక్తులుగ చేయును. యజ్ఞము చేయించిన ఋత్విక్కునకు సాలంకృత కన్యాదానము చేయుట దైవవివాహము. ఈ వివాహమువలన పుట్టినవాడు ఏడు తరముల పూర్వులను రాబోవు ఏడు తరముల వారిని తనను పాపవిముక్తులుగ చేయును. ఒక గోమిథునమునుగాని రెండింటినిగాని తన ధర్మకార్య నిమిత్తము వరునివలన గ్రహించి కన్య నిచ్చుట ఆర్ష వివాహము. ఈ వివాహమువలన కలిగిన కుమారుడు మూడుతరముల పూర్వులను మూడు తరముల పౌత్రాదులను పాప విముక్తులను చేయును. మీరిద్దరు ధర్మాచరణము చేయుడు అని చెప్పి పూజించి కన్యనిచ్చుట ప్రాజాపత్యము. ఈ వివాహము వలన కలిగిన కుమారుడు ఆరుతరముల పూర్వులను రాబోవు ఆరు తరములవారిని తరింప చేయును.

మహర్షులు గాంధర్వమునుగూడ వివాహముగ నంగీకరించిరి. ఆ వివాహమునందు గూడ వివాహ సంస్కారము జరుగవలయుననియు వివాహసంస్కారము చేయక కేవలము ఉదకము దానము చేసినంత మాత్రమున, వాగ్దానము చేసినంత మాత్రమున, పతిత్వము సిద్ధించదని యమునివాక్యము గలదు. గాంధర్వమునందు వధూవరులు పరస్పరము ప్రేమించుకొనిన పిమ్మట అగ్నిసాక్షిగ వివాహము చేసుకొనవలయు

నని పరాశరమాధవీయమున దేవలవాక్యముగలదు. హోమా దులు చేయనిదే భార్యాత్వముసిద్ధించదని వసిష్ఠబోధాయనులు చెప్పిరి. వివాహ సంబంధమైన మంత్రములే వివాహమున కన్యను భార్యగ నిర్దేశించుచున్నవి. మంత్రములు లేనిచో భార్యయే కాదని మదనపారిజాతమున నారద వాక్యము గలదు.

గాంధర్వము బ్రాహ్మణులకు నిషిద్ధము. అయినప్పటికి ఈ కాలమున ఈ వివాహములే ఎక్కువగ జరుగుచున్నవి. ఈ వివాహముల కయినను మంత్రములు ముఖ్యములు అని చెప్పుటకు గాంధర్వవివాహ విషయము ఇచ్చట వివరముగ చెప్పబడినది.

## ఆ శౌ చ ని ర్ణ య ము

దానకార్యమునందు వివాహమునందు అశౌచము వచ్చిన వెంటనే స్నానముచేసిన, దాతకు ప్రతిగ్రహీతకు కూడ అశౌచ శుద్ధియగునని బ్రహ్మపురాణమున గలదు. వ్రతము, యజ్ఞము, వివాహము, శ్రాద్ధము హోమము పూజ, జపమునందుగూడ ప్రారంభము తరువాత అశౌచము సంభ వించిన వెంటనే స్నానము చేసిన శుద్ధియగునని విష్ణు వచ నము గలదు. ఆరంభమనగ యజ్ఞమున వరణమిచ్చుట. వ్రత సత్రములయందు సంకల్పము; వివాహమున నాందీశ్రాద్ధము. శ్రాద్ధమునందు పాకము చేయుట అని వివరణము గలదు.

ఋత్విజుడు యజమానివలన మధుపర్కమును పొందిన పిమ్మట అశౌచ దోషములేదని బ్రాహ్మమునందు గలదు. ఆరంభించక పోయినప్పటికి మరియొక సుముహూర్తము లభించని సమయమున కూశ్మాండహోమముచేసి పంచగవ్య ప్రాశనముచేసినచో అశౌచశుద్ధియగునని పారిజాతగ్రంథము నందు విష్ణు వాక్యము గలదు. అశౌచము వచ్చినచో కూశ్మాండ మంత్రములతో అజ్యహోమముచేసి పాలు ఇచ్చు నట్టి గోవును దానముచేసి ఉపనయనము, వివాహము ప్రతి ష్ఠాదులు చేయవచ్చునని సంగ్రహమను గ్రంథమున గలదు, ఈ చెప్పిన అశౌచ దోషపరిహారములు అశౌచము వచ్చిన వెంటనే చేయవలయును.

## ధర్మ నిమిత్తము వివాహము

తన సామర్థ్యమును తెలిసికొని ఒక బ్రాహ్మణుని కైనను వివాహము జరిపించినవారు శివభక్తుని స్థానమును పొందగలరని మహాభారతమున గలదు. తల్లిదండ్రులులేని వారికి వివాహాది సంస్కారములుచేసినవారికి వచ్చుపుణ్యము చెప్పనలవికాదని అపరార్కమునందు దక్షుని వాక్యముగలదు. వివాహము జరుగుసమయమున ఆ వివాహసిద్ధికై ధనసహా యము చేసినవారు అశ్వమేధ యాగఫలమును పొందగలరని మదనరత్నమునందు, భవిష్యమునందు గలదు.

## కన్యాగృహమునందు భోజనము

కుమార్తెకు సంతానము కలుగనిదే ఆమె గృహమున భోజనము చేయరాదు. అటులచేసిన నరకప్రాప్తి యగునని అపరార్కమున ఆదిత్య పురాణమున గలదు.

## వివాహ సమయమున భోజనవిధి

వివాహ సమయమునందు. యాత్రయందు దొంగల భయము కలిగిన సమయమున ఒకేపాత్రయందు భోజనము చేయుట, ఒకే వాహనముపై ప్రయాణముచేయుట నిషిద్ధములు కావు. ఇతర సమయములందు చేసినచో చాంద్రాయణ వ్రతము చేయవలయును.

## చంద్రతారాబల దోష పరిహారము

వధూవరులకు తారాబలము కుదరనిచో, విపత్తారయందు, గుడదానము, నైధనతారయందు తిలలు బంగారము ప్రత్యక్తార యందు లవణము దానము చేయవలయును. చంద్రబలము సరిగా లేనిచో, శంఖము, లవణము; తారలు తిథులు కుదరనిచో బియ్యము, కరణము కుదరనిచో ధాన్యము, వారము యోగము కుదరనిచో బంగారము దానము చేసిన దోషపరిహారమగును.

## వివాహ మండప నిర్మాణము

ఎనిమిది మూరలు లేక పండ్రెండు మూరలుగల చతురస్ర మండపమును నిర్మించవలయును. దానికి నాలుగువైపుల ద్వారము లుండవలయును అని వసిష్ఠుడు చెప్పెను. ఆ మండపమునకు నాలుగు వైపుల మెట్లుండవలయును. దానిని వివిధములయిన చిత్రములతో నలంకరించ వలయును అని నారదమహర్షి చెప్పెను. ఇంటి కొలతల ననుసరించి ఈ మండపము పదియారు మూరలు, పండ్రెండు మూరలు, పది మూరలుండవలయును. దాని మధ్యన వేదికను నాలుగు స్తంభములతో నిర్మించ వలయును. మండపముయొక్క మూరలను కన్యమూరలతో కొలువవలయును. ఈ మండపము పైకెక్కుటకు మెట్లు పశ్చిమవైపున నుండవలయునని, సప్తమహర్షులు చెప్పిరి.

## అంకురారోపణము

శుభకార్యములకు ముందు అంకురారోపణ... చేయవలయును. అందు నిమిత్తము గృహము నలంకరించి మంగళ వాద్యములతో తూర్పుదిక్కునకుగాని పశ్చిమ దిక్కునకుగాని వెళ్ళి మట్టిని తీసుకు రావలయును. ఆ మట్టిని మట్టి పాత్రల యందుగాని వెదురుపాత్రలయందు గాని పోయవలయును. దానియందు అనేక విధములయిన (నవధాన్యములు) బీజములు పోసి నీరుపోయ వలయును. అని జ్యోతిర్నిబంధమున

నారద వాక్యము గలదు. ఈ అంకురారోపణమును శుభకార్యమునకు ముందు శుభముహూర్తము చూచుకొని చేయవలయును. అటుల కుదరనిచో శుభ కార్యమునకు ముందుగా అప్పటి కప్పుడు చేయవలయును అని బృహస్పతి వాక్యము గలదు.

అనగా శుభకార్యమునకు ముందుగా అంకురారోపణకు శుభ ముహూర్తము కుదరనిచో శుభకార్యమునకు కొంచెము ముందుగా చేసి తర్వాత శుభకార్యము చేయవలయునని తాత్పర్యము.

## అన్యవర విచారము

కన్య నివ్వగలనని వాగ్దానముచేసిన పిమ్మట వరుడు దుష్టుడు, పతితుడు, అని తెలిసినచో లేక వరుడు మరణించినచో ఆ కన్యను మరియొకరికిచ్చి వివాహము చేయవలయును. మంత్ర సంస్కారము జరుగక పోవుటచే ఆ కన్య తండ్రి అధీనయై యున్నది.

## లగ్నపత్రికా స్థాపనము

ఆరంగుళముల వెడల్పు, పండ్రెండు అంగుళముల పొడవు పదిపలకముల బరువుగల రాగిరేకుపై లగ్నపత్రికను వ్రాసి నీటితో నిండిన రాగిపాత్రయందు గాని, మట్టిపాత్రయందు గాని ఉంచవలయును. ఆ లగ్నపత్రికను ఇటుల ప్రార్థించ వలయును.

శ్లో॥ ముఖ్యం త్వమసియంత్రాణాం బ్రహ్మణా నిర్మితం పురా
భవభావాయ దంపత్యోః కాల సాధన కారణమ్॥

తా॥ ఓ యంత్రమా! నిన్ను పూర్వము బ్రహ్మ నిర్మించెను. యంత్రములలో ప్రధానమైన దానివి. దంపతుల పరస్పర ప్రేమకు కారణ మగుదువుగాక.

కొంతకాలము క్రిందట లగ్నవివరమును వేదికకు ఎదురుగా నున్న గోడపై పసుపురాచి దానిపై కుంకుమతో వ్రాయు నాచారముండెను.

## వరునకు మధుపర్కదానము

కన్య నివ్వతలచిన వరునికి మధుపర్కము ఇవ్వవలసిన దని యాజ్ఞవల్క్యుడు చెప్పెను. ఆ మధుపర్కమును, వరుని శాఖ ననుసరించిన మంత్రములచేతనే ఇవ్వవలయునని గృహ్య పరిశిష్టగ్రంథమున గలదు.

## కన్యాదానము

కన్యాదాన సమయమున కన్యాదాత ప్రవరను, కన్యాదాత ప్రపితామహుడు మొదలుకొని చెప్ప వలయునని స్మృత్యర్థసారమున గలదు. కన్యను గాయత్రిని గ్రహించువారు భోజనముచేసియే గ్రహింపవలయుననియు, దానము చేయువారు భోజనము చేయకయే దానము చేయవలయునని వ్యాసుని వాక్యము గలదు. వరునివిషయమున భోజనమనగా మధుపర్కమును గ్రహించుటయే యని వివరణమునగలదు.

కన్యాదానము చేయువాడు పశ్చిమాభిముఖముగ కూర్చొనవలయును వరుడు తూర్పుముఖముగ కూర్చొనవలయును. అని గృహ్య పరిశిష్ట గ్రంథమున గలదు. మొదట వరుని ప్రవరను చెప్పి పిమ్మట కన్యాప్రవరను చెప్పవలయునని మదనరత్నమున ఋష్యశృంగుని వాక్యముగలదు. కన్యాదాత మధుపర్కము నిచ్చిన వరునకు పశ్చిమముఖుడై ఈ క్రింది మంత్రమును చెప్పుచు ఉదకముతో కన్యాదానము చేయవలయును.

గౌరీం కన్యా మిమాం విప్ర యథాశక్తి విభూషితామ్।
గోత్రాయ శర్మణే తుభ్యం దత్తాం విప్ర సమాశ్రయ॥

అటు పిమ్మట యథాశక్తి భూమిని ఆవును దాసీని వస్త్రములను గేదెను అశ్వములను ఈయవలయును. కన్యాదానమును మూడుసారులు చేయవలయునని శౌనకుడు చెప్పెను. మంత్రమును మూడుసారులు చెప్పవలయునని తాత్పర్యము.

## గృహప్రవేశ హోమము

వివాహానంతరము ప్రధానహోమము తరువాత ప్రవేశ హోమము చేయుటకు అర్ధరాత్రమునకు పూర్వము, అవకాశము లేనిచో, మరునాడు ఉదయము ప్రవేశహోమము చేయవలయునని ఆశ్వలాయన మహర్షి చెప్పెను. ఒకవేళ రాత్రి

సమయమున వివాహాగ్ని ఉత్పన్నమైనచో మరునాడు సాయంకాలము ప్రవేశహోమము చేయవలయునని శౌనకుడు చెప్పెను. రాత్రి తొమ్మిది గడియల లోపల వివాహాగ్ని ఉత్పన్నమైనచో అప్పుడే హోమము చేయవలయునని అట్టుల కానిచో మరునాడు సాయంకాలము చేయవలసినదనియు సుదర్శన భాష్యమున గలదు.

## దేవతోద్వాసన

నాందీ శ్రాద్ధమున ఆహ్వానించిన దేవతలకు సమదివములయందు ఉద్వాసన చెప్పవలయును. సమదినము అయినప్పటికిని ఆరవరోజు పనికిరాదు. విషమ దినములయినప్పటికిని పంచమీ సప్తమీ దినములు పనికివచ్చును. నాందీ దేవతలకు ఉద్వాసన చెప్పకపూర్వము దర్శశ్రాద్ధము, శీతోదక స్నానము, నిత్యశ్రాద్ధము, బ్రహ్మయజ్ఞము, వేదాధ్యయనము, నదినిదాటుట, ఊరిని విడిచి వెళ్ళుట, ఉపవాసము, ఇతర వ్రతములు, శ్రాద్ధభోజనము పనికిరావని నిర్ణయదీపమున గార్గ్యవాక్యము కలదు. తీర్థమునందు వివాహమునందు యాత్రయందు యుద్ధమునందు దేశమున సంభవించిన ఉపద్రవ సమయములందు నగరగ్రామదాహమునందు అస్పృశ్యతా దోషములేదని బృహస్పతి చెప్పెను.

శుభకార్యము జరిపి సంవత్సరములోపల నువ్వులతో కర్మ చేయుట, శవమువెంట వెళ్ళుట కలశదానము, గ్రామాంతరము నందలి నదీస్నానము, అన్యక్షేత్ర దేవ

దర్శనము, తీర్థయాత్రలు పనికిరావు. వివాహానంతరము ఆరు మాసముల వరకు జీర్ణభాండాదుల విసర్జనము, ఇల్లు కప్పుట పనికిరావు. కుమారుని వివాహానంతరము ఆరుమాసములవరకు గాని సంవత్సరము వరకు గాని క్షురకర్మ పనికిరాదు. అభ్యంగన స్నానానంతరము అశౌచ సమయమున వివాహసమయమున పుత్రుడు జన్మించిన సమయమున సమస్త శుభ కార్యములయందు గోపీచందనము ధరించరాదు. ఈ విషయములు జ్యోతిష గ్రంథమునగలవు. వివాహము జరిగిన సంవత్సరము నందు నూతనవధువు పుష్యము, ఆషాఢము, అధిక మాసముల యందు భర్తృ గృహమున నుండరాదు. చైత్రమాసమున తండ్రి గృహమున నుండరాదని నిబంధ గ్రంధమున గలదు.

## నూతనవధూ గృహప్రవేశము

మార్గశిరము మాఘము చైత్ర వైశాఖములు జ్యేష్ఠమాసములయందు శుభముహూర్తమున నూతన వధూ గృహప్రవేశము అత్తవారింట యోగ్యమని జయతుంగ గ్రంథమున గలదు. వివాహదినమునుండి ఆరు ఎనిమిది పది రోజులు గృహప్రవేశమునకు తగినవనియు సంపదకు కారణములనియు నారదమహర్షి చెప్పెను. వివాహదినము మొదలుకొని పదియారు దినములవరకు సమ తిథులయందు, అటుపిమ్మట అయిదు మాసములవరకు బేసిమాసముల యందు. నూతన వధూగృహ ప్రవేశము తగుననియు, అటుపిమ్మట

ఎట్టి నియమము అవసరము లేదని సంగ్రహ గ్రంథమునగలదు. సమ సంవత్సరమున సమమాసమున నూతనవధూ గృహ ప్రవేశము జరిగినచో ఆమెకు అమెభర్తకుకూడ హాని కలుగు నని నారదవాక్యము గలదు. వివాహ దినమునుండి ఆరవ రోజునగాని, ఎనిమిదవ రోజునగాని, పదియవ రోజునగాని పంచాంగ సంశుద్ధి లేకపోయినప్పటికిని నూతన వధూగృహ ప్రవేశము శుభప్రదమని వృద్ధవశిష్ఠుడు చెప్పెను. నూతన వధూగృహప్రవేశవిషయమున శుక్రమౌఢ్య విచారణ అవస రము లేదనిమాండవ్యుడుచెప్పెను. నూతన వధూప్రయాణము నకు శుక్రుడు ఎడమ భాగముననున్న సుఖప్రదమనియు, కుడి వైపుననున్న హానిఅనియు, వెనుక వైపుననున్న ధనధాన్య ప్రదమనియు ముందు భాగముననున్న సర్వనాశనమనియు జ్యోతిఃప్రకాశ గ్రంథమున గలదు. మాఘ ఫాల్గుణ వైశాఖ శుక్ల పక్షములయందు శుభదినమున రెండవ తడవ వధువు పతి గృహమునకు వచ్చుట శుభప్రదమని ఋక్షుచ్చయ గ్రంథమున గలదు.

## పునర్వివాహము

వివాహము జరిగిన సమయమున లగ్నదోషము తారా బల దోషము కలిగినను, వధూవరులకు ఆశౌచాదులు వచ్చి నను మరల శుభదినమున వివాహము చేయవలయునని శ్రీధరీయమున గలదు.

ఓం మహర్షిభ్యో నమః
సన్మంగళాని భవన్తు స్వస్తి సర్వేషాం